చీకటిలో

# సిరివెన్నెల

(వచన కవితా సంకలనం)



చింతలపాటి మురళీకృష్ణ






ప్రచురణ

భారతీయ సాహిత్య పరిషత్ - చల్లపల్లి

(సాహితీ మిత్రుల వేదిక)

# చీకటిలో సిరివెన్నెల

చింతలపాటి మురళీకృష్ణ

భారతీయ సాహిత్య పరిషత్ - చల్లపల్లి
(సాహితీ మిత్రుల వేదిక)
తొలి కుసుమం



PRICE : Rs. **25/-**

ప్రతులకు : Ph : (08671) 65248

1) **చింతలపాటి మురళీకృష్ణ**
శ్రీకాకుళం - (వయా) కొడాలి
కృష్ణాజిల్లా : : పిన్ : 521 132

2) **శ్రీ ఆర్.ఎస్.కె. మూర్తి**
23/177 - బచ్చుపేట,
మచిలీపట్నం-521 001

---

Printed at : BRUNDAVAN OFFSET PRINTERS, MTM. ✆ 21204



# సమర్పణ

వాక్శుద్ధితో
శాస్త్రవిషయాలను వడ్డించి
వెలుగులు విరజిమ్మి
పేదరికాన్ని బిడ్డలకు పంచి
నిజాయితీని
రక్తంగా అందించి
ఆవిరియై పోయిన తేజస్స్వరూపులు
కన్నతండ్రి
ఆత్మజ్ఞానానికి - బాధ్యతతో_

మురళీకృష్ణ

డా॥ జి. వి. సుబ్రహ్మణ్యం
ప్రొఫెసరు (Retd)
యూనివర్శిటీ ఆఫ్ హైదరాబాదు,
హైదరాబాదు.

# మురళీనాదం

ఆధునిక కవి తన కోసం పాడుకొనే ఆత్మగీతం కాదు కవిత. అందరికోసం ఆక్రందించే ఆవేశం. ఒకప్పుడు కవిత్వానికి భవ్యకవితావేశం ప్రాణంగా భావించేవారు. కాని, ఈనాడు సామాజిక సంవేదనావేశం కవితకు జీవంగా పెల్లుబకాలి. ఆవేశంలో గాఢత, అభివ్యక్తిలో నవ్యత, ఆకృతిలో సంక్షిప్తత, స్పందనలో విస్ఫోటనశీలత నేటి యువత కవితలో కోరుతున్న గుణచతుష్టయం. ఈ నాల్గు గుణాలను పురుషార్థ చతుష్టయంగా సాధించినశక్తి శ్రీ చింతలపాటి మురళీకృష్ణగారి కవితకు సహజంగా అమరింది.

> *" నేల అంచులు తాకనంత ఎత్తులో*
> *సూర్యచంద్రులు అంటుకొనే స్థాయిలో*
> *నడుస్తున్న మేధావులారా!*
> *నేల పండుతున్న దుర్గుణాలను పట్టుకుపొండి*
> *- కలుపు పెరగకుండా ఉంటుంది ".* (మబ్బుల్లో)

ఈ కవిత చదివితే శ్రీ మురళీకృష్ణగారు తొలికవితా సంపుటి ప్రచురిస్తున్న క్రొత్త రచయితగా కనపడరు. ఆధునికతను ఔపోసన పట్టిన విజ్ఞాన కళామూర్తిగా గోచరిస్తారు. ఆధునిక విజ్ఞాన శాస్త్ర ప్రగతిని వ్యంగ్యంగా ప్రశంసిస్తూ అది గ్రహాలవెంట తిరిగే తెలివి మనకు నేర్పినా నేలమీది కలుపుమొక్కలను పెంచటానికి ఎలా పరోక్షంగా తోడ్పడుతున్నదో అధిక్షేపంగా అన్యాపదేశంగా మేధావుల పేరుతో చెపుతున్న పరిణత శిల్పి శ్రీ మురళీకృష్ణగారు.

సమకాలీన కవిత్వంలో పేరుకుపోయిన పాచిని ప్రక్షాళనం చేయాలనే దీక్ష దిటవుగా కలవాడు ఈ కవి. టి.యస్.ఎలియట్ ఒకప్పుడు యూరోప్‌ను వేస్ట్‌లాండ్ అన్నట్లు ఈ కవికూడా నేటి కవితా రంగాన్ని ఎడారిగా ఎగతాళి చేస్తున్నాడు. "*అస్పష్టత, అయోమయం, అర్థహీన విన్యాసం, అంధకార పదలాస్యం!" "నేటి తెలుగుకవి వైనం, మూగబాధతో మౌనం*" అన్నప్పుడు మూగబాధను ఎంత నిశ్శబ్దంగా శబ్దమయం చేయవచ్చో చూపించారు. ఆవేశాన్ని ఎంత లావాలాగా పొంగించగలరో, అంతర్వేదనను అంత బడబాగ్నిలా ప్రదర్శించగలరు ఈ కవి.

అవినీతి, లంచగొండితనం, స్కాములు, వాముల ఫలహారం మొదలైనవి పెద్ద మనుషులు చేసే పెద్దరికపు చేష్టలుగా చెలామణి అవుతున్న అభివృద్ధి కాలమిది. శ్రీ మురళీకృష్ణగారు ఈ వస్తువును ఎన్నుకొని ఎన్నిరకాలగానో కవితలు చెప్పారు. చెప్పిన తీరు చెప్పకుండా. అందులో 'హై-టెక్-మేత' ఒక పెద్ద హైలెట్. "*నోటి కందింది అంటే చాలదు- రిమోట్ సెన్సింగ్‌ద్వారా మొత్తం దేశాన్ని మేసేయ్ - ఇంకో నాలుగుయుగాల వరకూ నీ క్కరువుండదు!*". ఈ మినీకవితలో ఏ ఒక్కపదం మార్చినా మొత్తం నిర్మాణం దెబ్బతింటుంది: ప్రధానమైన స్కాముల నన్నింటినీ ధ్వనింప చేయటంతో పాటు స్కామ్‌గా బయటబడని ఒక బడా స్కామ్‌ను మన రిమోట్ సెన్సింగ్ శక్తికి అందిస్తున్న అపూర్వ ప్రతిభ ప్రశంసనీయం. ఈ వస్తువు మీద ఇంత బలమైన మినీ కవిత నే నింతవరకు చదవలేదు.

కవిత్వంలో నానా రుచిరార్థాలకు ఒక ప్రత్యేకస్థానం ఉన్నదని నన్నయ కాలం నాటినుంచీ సంప్రదాయం సాగుతూనే ఉంది. 'ప్రజల నాల్కలమీద జీవింపగలిగే అవకాశం సూక్తికే మొదట

లభిస్తుంది. ఆ సూక్తులు నీతులు కావచ్చు. నిర్వచనాలు కావచ్చు. నినాదాలు కావచ్చు. ఒక్కొక్కసారి భావచిత్రాలుగా ప్రభవించి ప్రజల భాషలో పలుకుబడులుగా నిలిచిపోవచ్చు. ఇటువంటి సూక్తులను ప్రత్యేకంగా రాసి ప్రచురించుకుంటుంటారు కొందరు కవులు. నిజానికి సూక్తులకు న్యాయం చేసుకోబోయి ఒక్కోసారి తమ కవితలకు తామే అన్యాయం చేసుకున్నవా రౌతారు. సూక్తులకోసమే కలం పడితే అది వేరే విషయం. బంగారు నగ పొదిగిన మణుల్లాగా కవితల్లో సూక్తులను కూర్చి శిల్పాలను తయారుచేసేవారే చిరకీర్తి పొందుతారు. ఆ వరుసలో నిలిచే మెళకువలను నిపుణంగా సాధించుకున్నారు శ్రీ మురళీకృష్ణగారు.

మచ్చుకు కొన్ని సూక్తి మౌక్తికాలు -

1. వడ్డించే బూతుపేరు నటన!
2. ఎప్పటికైనా కడుపు కుళ్ళిపోయేదే; ఒళ్ళు మళ్ళిపోయేదే!
3. కాదేదీ స్కాము కనర్హం?
4. భరతావని యువశక్తి - పతనోన్ముఖ సంపత్తి
5. ప్రాచీనం మగ్గిన పండు అర్వాచీనం ఆకలి మెతుకు.
6. ప్రజాస్వామ్యమంటే నోరున్నవాళ్ళ ఇష్టారాజ్యం.
7. అడ్డదారిలో ఆడది హై-టెక్ బిజినెస్ మాగ్నెట్.
8. పుట్టినందుకు సార్థకత సాధించు చచ్చినా బతికే మార్గం ఆలోచించు
9. అధికారం ఆడదాని లాంటిది ఆలోచన మగపురుషుని వంటిది.
10. మనిషి మనుగడ ఓ కాల్పనిక సత్యం.
11. మన జాతి పరువు ఫిలిం సెన్సార్ వాళ్ళ చేతుల్లో ఉంది.
12. నీతి పాఠాలు కాదు నియమ వర్తన కావాలి.

ఆంగ్లాంధ్ర సాహిత్యాలను లోతుగా అధ్యయనం చేసిన కవిగా, రచయితగా నిలద్రొక్కుకుంటున్న శ్రీ చింతలపాటి మురళీకృష్ణగారు చల్లపల్లినుండి భారతీయ సాహిత్య పరిషత్తుకు ఎనలేని కృషిచేయటం హర్షింపదగిన అంశం. జాతీయ జీవన సాంస్కృతిక సాహిత్య మూలాలనూ మూల్యాలనూ పరిశీలించి వాటి విలువలను కవితా ప్రక్రియ ద్వారా వెలువరించే కళాకృష్ణులు శ్రీ మురళీకృష్ణులు. నిజానికి ఈనాటి సమాజంలో దట్టంగా వ్యాపించియున్న చిమ్మచీకటిలో మంద్రమధురంగా వినపడుతున్న భారతీయాత్మ ప్రబోధ వేణునాదం ఈ కవితల సిరివెన్నెలలో ఉపదేశామృతాన్ని వర్షిస్తోంది. మానవతావాదానికీ భారతీయ జాతీయ భావనకూ ఒక మనోజ్ఞమైన భావవారధి ఈకవితల్లో కనపడుతుంది. అభ్యుదయం. మొగ్గ. గాలిపటాలు. గీత. వెలుగు కావాలి, నాకేంటంట?, భారతక్రాంతి, మనిషి వైతే - మొదలైన కవితలు భారతీయతను ప్రత్యక్ష పద్ధతిలో ప్రదర్శిస్తుంటే- అదే సంఖ్యలో మరికొన్ని కవితలు పరోక్ష పద్ధతిలో, అధిక్షేపధోరణిలో, వ్యంగ్యరీతిలో భారతీయతను ప్రబోధిస్తున్నారు. ఉభయ కావ్య రచనాశిల్ప మర్మజ్ఞులు శ్రీ చింతలపాటి మురళీకృష్ణగారు.

ఈ సిరివెన్నెల కొన్నిచోట్ల చల్లగా ఉంటుంది; మరికొన్నిచోట్ల చిమచిమలాడుతుంది. వెన్నెలకుకూడా వాడీ, వేడీ, ఆధునికతా, మార్మికతా ఉన్నాయని నిరూపించిన కవితాసంపుటి ఇది. ఇదే రచయితకు నా హృదయపూర్వకమైన అభినందనలు!

హైదరాబాదు<br>
20-9-1997

జి. వి. సుబ్రహ్మణ్యం

డా॥ యం. రామలింగేశ్వరరావు
M.A.(Eng)., M.A.(Tel)., M.A.(Hindi)., Ph.D.,
రీడర్, హిందూ కళాశాల
మచిలీపట్నం

మచిలీపట్నం
తే. 19-9-97

# "స్పందన : అభినందన"

శ్రీ చింతలపాటి మురళీకృష్ణ "చీకటిలో సిరివెన్నెల"ను కురిపించి పరిచయం చెయ్యమన్నారు. పరిచయమంటే సాహసమే అవుతుంది. గత రెండు దశాబ్దాలుగా ఆయన చేస్తున్న సాహితీ సేవ సుపరిచితం. అయితే ఒక పద్యకవిగా మాత్రమే ఆయన అందరికీ తెలుసు. వచనకవిగా మాత్రం యిదే తొలిపరిచయం. ఆ అవకాశం నాకు దొరికినందుకు సంతోషంగా ఉంది. శ్రీ మురళీకృష్ణగారి 'సిరివెన్నెల' వారి ఆశావాదానికి గుర్తు. చీకటికడుపులో నుండి చీల్చుకువచ్చింది కనుక ఇది క్రాంతికి ప్రతీక.

శ్రీ మురళీకృష్ణ కవిత్వంలో మంచి కమిట్‌మెంట్ కన్పిస్తుంది. తాను ఏం చెప్పదల్చుకున్నాడో ఒక కవిగా స్పష్టంగా తెలియాలి. అందులో అస్పష్టతకు తావుండకూడదు. అంతేకాదు స్పష్టమైన సందేశమో, నిర్దేశమో ఉండాలి. అపుడా కవిత్వానికి ప్రయోజనం ఉంటుంది. శ్రీ మురళీకృష్ణ కవిత్వంలో యీ గుణాలన్నీ పుష్కలంగా కనిపిస్తాయి. నేడు తెలుగు చలనచిత్రాలకు పట్టిన దౌర్భాగ్యం మనకు తెలిసిందే! 'పాండీబజార్' ఒకప్పుడు తెలుగు చలనచిత్రానికి మెట్టినిల్లు. ఆ శీర్షిక కల్గిన కవితలో యీ కవి అంటారు : "పూర్వం పెద్దలు పడుచుకుర్రాళ్ళకి దాంపత్యరహస్యాల్ని ప్రైవేటుపెట్టి చెప్పించేవారు- పాపం అనాగరకులు వాళ్లు! ఇవాళ దంపతులకు కూడా తెలియని నిగూఢ రహస్యాల్ని నేలటిక్కెట్టు కొనుక్కున్న నెలలు నిండని పసివాళ్లకూడా నిలబడి అప్పగిస్తున్నారు! సినీ నిర్మాతలూ- మీ సంస్కారానికి జోహార్లు- జాతి సజీవదహనానికి యివే మీరిచ్చే నెగళ్లు!" అని. భారతీయులకు అతి పవిత్రమైన స్త్రీమూర్తిని నేటి చలనచిత్రరంగం ఎంత చులకన చేస్తున్నదో- 'పారాఖరాబ్' అనే కవితలో చెప్తూ : "నడుమూ-నాభీ ఒడలూ-మెడలూ సొంపుగా వడ్డించే ఆడది సినీ నిర్మాతలకు రిజర్వ్‌బ్యాంక్"- అంటారు. మరోచోట కోపంగా : "మన జాతి పరువు ఫిలిం సెన్సార్ వాళ్ల చేతుల్లో ఉంది. పిల్లల్ని దొంగలుగా మార్చినా.. కుర్రాళ్లని రేపిస్టులుగా పురికొల్పినా.. ఇరుకు బుర్రల్లో కొత్తకుళ్లు నింపినా.. ఆడదాన్ని అసహ్యంగా దిగజార్చినా.. ఇలా ప్రశ్నిస్తూ "ఎవరు దీన్ని సరిదిద్దేది?" అంటారు. అయితే ఎవరో వచ్చి యీ సమస్యకు సమాధానం చెప్పాలని ఆయన ఆశించలేదు. అందుకే "నగ్నత్వాన్ని నగ్నంగా ఎండగడుతున్నా! నాజూకుగా సమాధి చేస్తున్నా" అంటారు.

బాలకార్మికులమీద అనాదిగా అన్నిభాషల్లోనూ రచనలు వస్తూనే ఉన్నై. అయితే ఏ ప్రభుత్వమూ, ఏ చట్టమూ దీనికి పరిష్కారం చూపలేకపోయింది. ఎందుకంటే 'ఆకలి' ముందు ఏ శక్తీ నిలబడలేదుకదా! "మొగ్గ" అనే కవితలో మురళీకృష్ణ వాళ్లను పువ్వుగా రూపుతొడిగేలోగానే చిదిమివేయబడుతున్నట్లు అభివర్ణిస్తారు. "పొట్టతో సైకిళ్లకు గాలి కొడుతూ. ఫ్రీగా నవ్వేసే పరమాత్ముడిలా.." అన్నపుడు హృదయం ద్రవించనివారు, కళ్లుచెమర్చనివారు ఎవరుంటారు? దీనిలో 'విషాదం' - అండర్‌కరెంటులా పాకుతూ కన్పించటంలేదూ? అందుకనే "పసివాళ్లపై పాడులోకం పగబట్టిందేమో?" అంటారు నిట్టూరుస్తూ!

నేటి సమాజం తీరుతెన్నులు మురళీకృష్ణకు బొత్తిగా రుచించటం లేదు. అందుకే ఆయన అడుగడుగునా వ్యంగ్య బాణాలు కురిపిస్తూ కర్తవ్యోన్ముఖులు కండని ప్రబోధిస్తారు. "స్కామ్ ట్రీట్‌మెంట్" అనే కవితలో "ఈ దేశ పునాదులు సైతం లీకులకే పూర్తిగ సొంతం! పి.యం.ఓ. మొదలు సమస్తం- లాలూచీ లవుతయ్ నేస్తమ్!-"అంటారు. స్కాంరాయుళ్లని చూసి జాలి కురిపిస్తూ: "వాడి కడుపు పసిఫిక్ కన్నా లోతు కాబోలు - పాపం దేశఖజానా ఏం సరిపోతుంది?" అంటారు. వ్యంగ్యం ఈ కవితకు ప్రాణం. "గుణింతాలు యిన్ని ఉన్నా ఒక్క కా గుణింతానికే ఐదోతనం అబ్బింది"- అన్నపుడూ అదే వ్యంగ్యం ఊపిరిపోసుకుంది. పట్టెడన్నం కోసం చిన్నతప్పును చేసిన చిరుద్యోగిని పీనుగుగాను, ముడుపులు పట్టి, దాణాలు మేసి, కోట్లకొలది కుంభకోణాల్లో మునిగిన పెద్దవాళ్లని ఏనుగులుగాను అభివర్ణిస్తూ "మనమూ గొప్పవాళ్లతో సమానంగా పెరుగుదాం!" అంటారు కసిగా! అయితే మనమూ లంచాలు పట్టాలని, స్కాంల్లోకి దూకాలని ఆయన చెప్పారనుకుంటే పొరబాటే! "దురదగొండ, చేదుదొండ లేమాత్రం మనకొద్దు-మల్లెదండ, మావిపిందె అవి మనకెంతోముద్దు!" అంటారు మార్గదర్శనం చేస్తూ! "రాజలాంఛనాలతో సింహాసనంపైకెక్కిన అడవిమృగం - పొట్టపగిలేలా మెక్కినా 'కడుపుపగిలి చచ్చింది' అంటారు. కనుక ప్రతి అన్యాయానికీ అత్యాచారాలకీ కాలం తప్పక తీర్పుచెప్తుందని ఆయన విశ్వాసం. అలా అని కాలంపైనే భారమంతా వదిలేసి, చేతులు ముడుచుకొని కూర్చోమని ఆయన చెప్పరు. పైపెచ్చు "ప్రతివాడికీ చుర్రెక్కితే పోరగాళ్లంతా బుద్ధిగా ఉంటారు! జ్వరం తీవ్రమైతేనేగా థర్మామీటరు పగిలేది!" అంటారు. అసలు ఎదుటివాడు మనమీద పెత్తనం చెలాయించటానికి కారణం మన చేతకానితనం - మనం ఇచ్చిన అలుసేనని ఆయన విశ్వాసం. "సవారీ" అనే కవితలో "అల్పాయుష్షు రాజును చూసి అదిరి ఛస్తావేం? వాడి చేతి కొరడా నువ్విచ్చినదేగా!"- అనడంలోని ఆ వేగం ఎంతో స్ఫూర్తివంతమైంది.

ఈ కవిలోని తాత్వికుడు అప్పుడప్పుడూ కవితల్లో కన్పిస్తూ ఉంటాడు. తెల్లవారుతుందని తెలుసు కనుక చీకటికి భయపడమని, మళ్లీ పుడతాడని తెలిసికూడా, మనిషి మృత్యువుకు భయపడ తాడనీ అంటూ "ఏమిటో యీ మాయదారి అనుబంధం"- అంటారు నిట్టూరుస్తూ! రాబర్ట్ బ్రౌనింగ్ రచించిన "ఎబ్రా" వంటి కవితల్లో కన్పించే తాత్త్విక మీమాంస వీరి కవితల్లో అక్కడక్కడా కన్పిస్తుంది.

కవికి ఉండవలసిన ముఖ్యలక్షణాలు కమిట్‌మెంటూ, ల్యుసిడిటీ - అంటే స్పష్టత! భావతీవ్రత వీటికి తోడైనపుడు ఆ కవిత్వం పాఠకుల గుండెల్లోకి చొచ్చుకుపోగల్గుతుంది. ఈ కవి : "నేరాలను పూజిస్తున్నారు-వ్యభిచారులను సత్కరిస్తున్నారు - మనుషుల్లారా! మీరు మానవులేనా?" అన్నప్పుడు యీయన ఎంతటి మానవతావాదో స్పష్టంగా బోధపడుతుంది. పుట్టటం మనిషిగా పుట్టినా మానవుడనిపించుకోవటం మాత్రం అందరికీ సాధ్యమయ్యే విషయంలా కన్పించటం లేదు. ఇదే ఆయన ఆవేదన. ఆ ఆవేదనకు అక్షరరూపం కల్పించి నిరాశతో క్రుంగిపోక, ఎంతో ఆశతో, ఆకాంక్షతో "చీకట్లో సిరివెన్నెల"ను కురిపించటానికి యీ సంకలనంలో ప్రయత్నం చేశారు. అందుకు వారికి ఇదే నా అభినందన. భవిష్యత్తులో ఈయన మరిన్ని మంచి కవితలను వ్రాయాలని ఆశిస్తూ... ఆశీర్వదిస్తున్నాను.

**యం. రామలింగేశ్వరరావు**

## ఆర్. యస్. కె. మూర్తి

అధ్యక్షులు
భారతీయ సాహిత్య పరిషత్
ఆంధ్రప్రదేశ్

# శుభం !

ప్రపంచ సాహిత్యాలన్నింటిలో భారతీయ సాహిత్యానికి తనదైన విశిష్టత ఉంది. 'సంవేదన' నుంచి ఉద్భవించిన సాహిత్యం మనది. క్రౌంచమిథునంలో ఒక పక్షిని బోయవాడు నేలకూల్చగా చలించిపోయిన మహర్షి "మా నిషాద..." అంటూ పలికిన వేదనాపూరితపు పలుకే, రామాయణ మహాకావ్యమై ప్రభవించింది. జటాయువును సమాదరించి, విగతజీవి అయిన ఆ పక్షికి సంస్కారాలు జరిపించిన ధార్మిక, కారుణ్యమూర్తి - శ్రీరామచంద్ర ప్రభువు. ఉడుత తనువు నిమిరిన ధార్మిక ప్రేమమూర్తి ఆయన. సరే, తనయునిగా, సోదరునిగా, స్నేహితునిగా, భర్తగా, ప్రభువుగా ధర్మస్వరూపమే ఆయన కదా! రామో విగ్రహవాన్ ధర్మః.

ఇట్లా సంవేదన నుంచి ప్రభవించిన ఆది కావ్యంలో ఆవేదన ఆక్రోశంగా ప్రకటితం కాలేదు. నిషాదునిపై నిప్పులు కురిపించలేదు. ధర్మస్వరూపాన్ని సాకార మానవునిగా చిత్రించిన మహాద్భుతమైన కావ్యమది. ఇట్లా సంవేదన క్రోధంగానో, హింసాత్మకంగానో మలచకపోవటం - భారతీయ సాహిత్యపు మరో విశిష్టత.

ఇటువంటివే మరెన్నో విశిష్టతలు తనదిగా కలట్టిది - భారతీయ సాహిత్యం. వేదవాఙ్మయం నుండి నేటి వరకు సమీకృతమైన మన సాహిత్యసంపద విలువ కట్టలేనిది.

కాకపోతే ఆంగ్లేయుల పరిపాలన ఫలితంగా - మిగతా అన్ని రంగాలలో వలెనే - సాహిత్యరంగంలో కూడ విదేశీ భావనలు, విధానాల ప్రభావం బాగానే పడింది. శైలులు, ప్రక్రియలు సాహిత్యాన్ని సుసంపన్నం చేస్తే, భావనల ప్రభావం కారణంగా భారతీయ సాహిత్య విలువలు కొన్ని పరాభూతమై... సాహిత్యపు ప్రయోజనమే దెబ్బతిన్నది.

ఇట్టి జారుడు బల్లమీద నుంచి భారతీయమైన సాహిత్యపు విలువలను కాపాడగలందులకే కృషిచేస్తున్న ఒక అఖిలభారత సాహిత్యసంస్థ - భారతీయ సాహిత్య పరిషత్.

మూడు సంవత్సరాలకు పూర్వం మన రాష్ట్రంలో కూడ పనిచేయటం ప్రారంభించిన భారతీయ సాహిత్య పరిషత్, యిన్ని రోజులుగా సభలు, సమావేశాలు, చర్చాగోష్ఠులు, రచయితల శిబిరాలు వంటివి వివిధ నగరాలలో నిర్వహించుకుంటూ వస్తున్నది. ఇప్పుడీ సంకలనం ప్రచురణతో పరిషత్ ప్రచురణ రంగంలో కూడ ప్రవేశిస్తున్నది. భారతీయ సాహిత్య పరిషత్, చల్లపల్లి వారు పరిషత్ ప్రతిష్టను, ప్రభావాన్ని పెంచే ఈ ప్రచురణను చేపట్టటం పరిషత్ కార్యకర్తగా నాకెంతో ఆనందం కలిగిస్తున్నది. - శుభం.

* * * * *

చింతలపాటి మురళీకృష్ణ గారి కవిత్వం భారతీయ సాహిత్యపు విలువలను పునరుద్ధరించేదిగా, వాటికి పరిపోషకంగా ఉండటం - పరిషత్‌కు ఆనందం కలిగిస్తున్న మరో అంశం. ఈ సంకలనం పూర్తిగా చదివిన వారికి ప్రతి కవితలోనూ కవిగారి సంవేదనే ద్యోతకమవుతుంది. స్వర్ణభారతిలో నైతిక, ధార్మిక, ఆధ్యాత్మికాది విలువలు గ్రాసి చెందటం... మానవ కారుణ్య భావనలకు.. ప్రేమానురాగాలకు మినహాయింపులు పెరిగి పోవటం... స్వార్థం వెర్రితలలు వేయటం వంటి అనేకానేక

రుగ్మతలను చూచి కవి పొందే ఆత్మక్షోభే మనకీ సంకలనంలోని ప్రతి కవితలో ప్రస్ఫుటీకరణ చెందుతూ కన్పిస్తుంది. "పొట్టతో సైకిళ్ళకు గాలి కొట్టే మొగ్గలపై పాతులోకం పగబట్టినట్లున్నదని" కవి పరిదీనులవుతారు. "మళ్ళీ పుడతామని తెలిసినా చనిపోయిన మనిషిని గురించి విలపించే మాయదారి అనుబంధాల" నాయన అపహాస్యం చేస్తారు. "పొట్టకోసం బుర్రలను తాకట్టు పెట్టే" రాజీల నాయన నిరసిస్తారు. కలష్నికోవ్ తుపాకులు ఆత్మబంధువులవుతున్న" హింసాత్మక ప్రవృత్తుల ప్రజ్వలనలు ఆయనను విహ్వల చిత్తులను చేస్తాయి. విలువల్ని అర్ధణాకు అమ్మేసి, మానవులను నీచులను చేస్తున్న నాన్ సెన్సా(ర్) ధోరణుల నాయన విమర్శిస్తారు. అయితే విమర్శయినా, విముఖత అయినా ఈ కవి ప్రకటించేది సంవేదనతోనే. క్రోధంతోకాదు. సంస్కరణాభిలాషతో తప్ప ప్రతీకారేచ్ఛతో కాదు.

అట్లాగే వివిధ జాతి జీవన సమస్యలకు పరిష్కారంగా ఈ కవి సూచించే మార్గాలు కూడ భారతీయ విలువల అదుపునకు లోబడే ఉంటై తప్ప విదేశీ భావజాలపు విద్వేషాగ్నులను వెదజల్లవు. మన పళ్ళతో మన నాలుకను కొరుక్కోమనే "సర్వరోగ నివారణల" నీయన సూచించరు.

"స్కాములకు పరిష్కారం నిస్వార్థ సంస్కారం"
"మంచిని పోషించి మహాత్ములుగా నిలవండి"
మరైతే ఈ మంచి ఎక్కడి నుంచి వస్తుంది? అన్న ప్రశ్నకు కవి చెప్పే సమాధానం -
నీవే... నీవే
నీలో నుంచే రావాలి వ్యక్తి సంస్కారం

ఇట్లా ఆత్మీయతానురాగాలు, సంస్కారాలు వ్యక్తులమధ్య పెరగటం ద్వారా సమాజ జీవితం నిర్మలం కాగలదనే ఆశాభావం వీరి కవిత్వపు విలువను పెంచుతుంది. చీకటిలో చిరువెలుగులను చూడటమే ఆశావాదం అంటాం గదా! ఈ కవి చీకటిలో "సిరివెన్నెల"నే చూస్తున్నారు. సిరివెన్నెల సమాజ జీవితాన్ని నింపివేయగల మంచి రోజు కోసం కవులు కలలుగనాలనేదే వారి కవిత్వ తత్వంగా మనకు అర్థమవుతుంది. సంక్షిప్తంగా చెప్పాలంటే ఈ కవి కవితా వస్తువు - భారతీయత. శుభం.

* * * * *

సమున్నతమైన యిట్టి కవితా వస్తువును శ్రీ మురళీకృష్ణ సరళమైన శైలిలో... సున్నితమూ, సునిశితమూ అయిన భాషలో మనకు అందిస్తారు. వీరి పదబంధాలు పదునుగా... కొన్ని ఛెళ్ళుమనే కొరడా దెబ్బల్లా ఉంటై.

"మనుషుల్లారా మీరు మానవులేనా?"
"వర్ధించే బూతుపేరు నటన"
"కల ఆగిపోయింది కలం పరుగులెత్తింది"

ఇటువంటి వెన్నో చురుకైన చెంప దెబ్బలను సమాజంలోని వికృతులకు తగిలిస్తారీయన.

వీరి కవితా వైభవాన్ని పెంచే మరో అంశం - సునిశితమైన వ్యంగ్యం. ముద్దాయి ఎవరు? ... జాతిరత్నాలు... డూడూబసవన్న... హైటెక్ మేత - వంటి వివిధ కవితలలో శ్రీ మురళీకృష్ణ దర్శింపజేసిన వ్యంగ్య వైభవం చదివి ఆనందించవలసినదే.

ప్రకృతిని పరమగురువుగా గౌరవించిన వీరి పరిశీలనా దృష్టికూడ వీరి కవిత్వపు విలువను పెంచుతుంది. "చైతన్యం ఉద్భవించేది వృద్ధశిశిరం నుంచేకదా"- అన్నపుడు తరాల అంతరాలంటూ తండ్రికొడుకుల మధ్య వర్గవైషమ్యాలను పెంచగోరే దుర్మార్గాన్ని ఈయన నిరసిస్తున్నారు. "దురదగొండ చేదుదొండ లేమాత్రం మనకొద్దు మల్లెదండ-మావిపిందె లవి మనకెంతోముద్దు" -- అన్నపుడు వీరు మంచిచెడుల మిశ్రమమే మానవ నైజమనీ... చెడును పరిహరించి, మంచిని పెంచుకొనటమే

పురోభివృద్ధికి పరమమార్గమని.. కాకిలా చీకు వస్తువులను కాకుండా.. హంసలా క్షీరాన్నే వేరుచేసుకునే స్వచ్ఛత మన దృష్టిలో ఉండాలని వీరు సూచిస్తున్నారు.

చివరగా ఈ కవి అందిస్తున్న 'గీత' సందేశం గమనించండి.

భారతీయుడా కర్మభూమిలో పుట్టి
ముదనష్టాలకి ఆశపడి అధర్మమూర్తికి పెంపు వెళ్తున్నావా?

(బానిస కావటం అని అనకుండా - పెంపువెళ్ళటం అన్న ప్రయోగంలోని సొగసు గమనించారా?)

జన్మాంతంలోగా మర్మం విడిచి
మనోవ్యథ చెందాల్సి ఉంటుంది మరచిపోకు!

చిరంతనమైన ఈ ధార్మిక వాస్తవాన్ని.. ఒక హెచ్చరికగా కవి అందిస్తున్న 'గీత' సందేశమిది! ధార్మికమూ... అనురాగరంజితమూ... ఆశావహమూ అయిన ఈ కవి సంయమనదృష్టి ప్రతి అక్షరంలోనూ ప్రతిఫలించే సంకలనమిది. భారతీయ సాహిత్యపరిషత్ ప్రథమముద్రణగా వెలువడటం - పరిషత్ అదృష్టం. శుభం!

* * * * *

ఔచిత్యభంగం అవుతుందేమో? అయినా వ్యక్తిగత విషయం ప్రస్తావిస్తా, మన్నించగోరుతున్నాను. శ్రీ మురళీకృష్ణ మా అల్లుడుగారు. చాల సంవత్సరాలకు పూర్వమే నేను వారి పద్య, వచన కవితలను పెక్కింటిని చదివాను. వాటిలో ఉన్న 'పదును' చూచి ఆనందించేవాడిని. పైపెచ్చు వాస్తు, జ్యోతిష శాస్త్రాలలో వారికున్న ప్రవేశంచూసి అబ్బురపడే వాడిని. అదే సమయంలో ఉద్యోగస్థుల యింక్రిమెంటాలిటీ గురించి

ఇంక్రిమెంటు మా అడ్వెంచరు
ప్రమోషన్ మా పరమాశయం
మము బ్రోవమని చెప్పవే - సీతమ్మ తల్లీ

అన్న ఆరుద్ర విసుర్లు గుర్తుకొచ్చేవి. వాస్తుజ్యోతిషాలలో పలువురి పరిగణనను పొంది.. కవితామ తల్లి ముద్దుబిడ్డడిగా ఎదుగుతున్న అల్లుడుగారు నా అదృష్టాలలో ఒకటైనారు. "యియర్లీ యింక్రిమెంట్లు సకాలంలో రాకపోయినా ఈయన పట్టించుకోవటంలేదు నాన్నా" అని మా అమ్మాయి ఫిర్యాదు చేస్తుంటే, నేను పొంగిపోయాను. ఆరుద్రగారి సీతమ్మతల్లి భక్తుడుగా కాకుండా.. శ్రీ భారతీమాత బ్రోచే భక్తుడుగా మురళి రూపొందటం వ్యక్తిగతంగా నాకు గర్వకారణం. తన ఉద్యోగధర్మాన్ని లోప రహితంగా నిర్వర్తిస్తూ.. కళామతల్లి సేవలో ఆయన మరింతగా ఎదగాలని కోరుకుంటాను. శుభం.

* * * * *

"అమ్మనుజాధముల కిచ్చి.." అన్న పోతనగారి మాట పాటించారో ఏమో, శ్రీ మురళీకృష్ణ ఈ తమ ప్రథమ సంకలనాన్ని కవి పండితశ్రేష్ఠులు, వాస్తుజ్యోతిషపండితులు, పంచాంగకర్తలు అయిన తమ తండ్రిగారు స్వర్గీయ చింతలపాటి లక్ష్మీనరసింహశాస్త్రిగారికి అంకితమిస్తున్నారు. స్వర్గీయ శాస్త్రిగారు ప్రేమానురాగాలముద్దగా కూడ నాకు సహదరణీయులు. తాము కాన్సరుతో బాధపడుతూ... వియ్యపురాలి అన్నగారు పోయారని.. ప్రత్యేకంగా కారులో ఆమెను పలకరించవచ్చిన సాంప్రదాయ నిరతులాయన. కారు దిగి, చేతిలో వాటర్‌బాటిల్‌తో మా యింట్లోకి వస్తున్నరూపమే నా మనసులో తళుక్కుమంటూ ఉంటుంది - వారి స్మరణ వచ్చినప్పుడల్లా.

అటువంటి మానవతామూర్తికి మానవీయ విలువలను పెంచే సాధనంగా రూపొందిన ఈ సంకలనం అంకితమివ్వటం - దీని విలువను మరింతగా పెంచుతున్నది. శుభం.

మరెన్నో మంచి సంకలనాలను శ్రీ మురళీకృష్ణ కలం నుంచి ఆశిస్తూ -- వారి కవితా వ్యవసాయానికి మరోసారి శుభం పలుకుతూ......

**- ఆర్. యస్. కె. మూర్తి**

# అభ్యుదయం

ఓ మనిషీ - నీలోపలి
మంచితనం పెంచుకో -
ప్రకృతిని చూస్తూ అయినా
పరమార్థం తెలుసుకో !

పనికిరాని భావాలను
బిగదుడుపుగ విడిచిపో-
అభివృద్ధికి నడిపించే
కొత్త చిగురు తొడుక్కో !

పరిమళాలు వెదజల్లుతు
పరువు బరువు పెంచుకో -
పదిమందికి నీడ నిచ్చి
ఫలసాయం నింపుకో !

దురదగుండ - చేదుదొండ
లేమాత్రం మనకొద్దు -
మల్లెదండ - మావి పిందె
లవి మనకెంతో ముద్దు !!

# మొగ్గ

పసివాళ్ళపై
పాడులోకం
పగబట్టిందేమో -
బాలకార్మికులుగా
పతిత భావాలకు పెద్దభోషాణాలుగా
పాపిష్ఠి తాయిలాలకోసం
పళ్ళికిలించే జీవచ్ఛవాలుగా-
సినీ మోజులో
చిదిమేయబడే చేతకాని చిలకల్లా -
పొట్టతో సైకిళ్ళకు గాలికొడుతూ
ఫ్రీగా నవ్వేసే పరమాత్ముడిగా-
చిద్విలాసం చూపే
పసివాళ్ళపై
పాడులోకం పగబట్టిందేమో !
షేకులకీ, దాదాలకీ
ఐదోయేటనే ఆశల్ని అమ్మేసి
అరవై యేళ్ళ
ఆర్తితో బతకటానికి
ఆత్రంతో ఎదుగుతున్న
పసివాళ్ళపై
పాడులోకం పగబట్టిందేమో -
అర్థనగ్న చిత్రాలతో
బూతుశైలి సిద్ధాంతాలతో

ఆరిపోయే బుద్ధుల్ని
ఇదోయేటనే నేర్పేస్తూ
వెలగాల్సిన
దీపాల్ని ఆర్పేస్తూ -
పసివాళ్లపై
పాడులోకం పగబట్టిందేమో !!



## రాజీ

ఓ బానిసోడా
నీ బ్రతుకును నిర్దేశించేది
జానెడు పొట్టే అయితే -
దాన్ని
కన్నీళ్లతోనే నింపేసుకో
కష్టాలతోనే కప్పేసుకో -
దాని తగలాటంతో
బుర్రను తాకట్టు పెట్టబోకు !
నోటిని
మూదుగొట్టింలా
వాడెయ్యబోకు !
ఎప్పటికైనా
కడుపు కుళ్లిపోయేదే -
ఒళ్లు మళ్లిపోయేదే !!

# యదార్థం

వసంతాన్ని ఆహ్వానించే

దమ్ము

శిశిరాని కెక్కడిది ?

నవతరాన్ని

రెచ్చకొట్టే తత్వం

వృద్ధాప్యాని కెక్కడిది ?

అయినా -

నవ వసంతం

వస్తూనే ఉంటుంది ...

వృద్ధ శిశిరం

తనువు చాలిస్తూనే ఉంటుంది -

చైతన్యం

ఉద్భవించేది

వృద్ధ శిశిరంలో నుంచే కదా!

# మాయదారి

చీకటి పడినా
దుఃఖించం -
తెల్లవారుతుందని తెలుసు !
నిద్రపోయినా
భయపడం -
తెల్లవారి లేస్తామని తెలుసు !
- కానీ
మళ్లీ పుడతాడని తెలిసినా
చనిపోయాడంటేనే
భయపడి చస్తాం -
ఇక
ఆచూకీ తెలీదని కాబోలు !
ఏమిటో
ఈ మాయదారి
అనుబంధం !

# ఎడారి

అస్పష్టత - అయోమయం
అర్థహీన విన్యాసం -
అనాగరక సన్యాసం
అంధకార పదులాస్యం !

నేటి తెలుగు కవి వైనం
మూగబాధతో మౌనం -

దిగజారిన వి (వ) లువలను
సరిదిద్దాలను ధ్యానం
ఏ ఒకరికి ఉపదేశం
పట్టుదు - ఇది నీ దేశం !!

# ఆకలి తప్పులు

ఎందరో మహానుభావులు
ఏదో స్వార్థంలో కూరుకున్న పాపులు
ఎందరో పుణ్య చరిత్రులు
ఈ దేశ ప్రయోజనాలను
నంజుకునే పరిష్కులు !

గోదాను బట్టి దోహం
స్వార్థపును బట్టి తినగల ప్రతాపం -
ఎందరో కవి పీఠికులు
ఎందరెందరో ఆకలి తప్పులు !

తల్లీ - భారతీ
నీ బిడ్డల దారిద్ర్యం
తీర దారేదీ ?
నిస్వార్థ సంస్కారం
అలవాటయ్యే రోజేదీ ?

# ముద్దాయి ఎవరు ?

ఖూనీ....ఖూనీ... హత్య... హత్య...
ముద్దాయిని పట్టుకోండి -
పట్టుకోండి ... పట్టుకోండి ...

✧ ✧ ✧ ✧ ✧

పదండి ... పదండి
పట్టుకోండి ... పట్టుకోండి ...
పారిపోతున్నాడు-
వీడే... వీడే...
వీడొచ్చాకే హత్య జరిగింది...!
పట్టుకోండి ... పట్టుకోండి ...
తన్నండి ... కొట్టండి ... చంపండి ...

✧ ✧ ✧ ✧ ✧

హన్నా..
లేకపోతే
నేను చంపటం చూసి
పారిపోతావా ?
- ఫినిష్ .... !!

# శాస్త్ర వాక్యం

బండ చదువు మనకెందుకు
పంతులు గోచీ ఉండగ -
పబ్లిక్ బంధా రెందుకు
లీకుల టెక్నిక్ యుండగ !

పరిత్రాణాయ వెధవానాం
వినాశాయచ బళ్లునాం
విత్త సంపాదనార్థాయ
సంభవామి బడే బడే !

కోరిన
వాచర్లొచ్చే
టెక్నిక్ చేతిలో ఉండగ
నన్నే కొలువుము ముందుగ
ఇంకో
పంతులు దండగ !!

# స్కాం ట్రీట్‌మెంట్

కాదేదీ స్కామ్ కనర్హం
దొంగాలూ మిగులు పాలూ
భేదంగులు - ముడుపుల కథలు
నవ భారత నిర్మాణంలో
అరుదరుగ
పేర్చిన ఇటుకలు !
ఈ దేశ పునాదులు సైతం
లీకులకే పూర్తిగ సొంతం
పి. యం. ఓ మొదలు సమస్తం
లాలూచీ లవుతయ్ నేస్తం !
భరతావని పౌరులోన
బాధ్యత గల వ్యక్తులు ఎవ్వరు?
ఆజాదీలా గర్జన చేస్తే
కాల్పించి పడేస్తా రంతే !
అధికారం అందిందంటే
ఆకలిగొను తోడేళ్ళల్లే -
అరపూటలో దేశఖజానా
అంతా మింగేస్తారంతే !
ఈ నాటక మాగాలంటే
నీతి యనే కత్తిని నూరి
అవినీతిని తరిగెయ్యాలి -
ఆశ్రయుతను కడిగెయ్యాలి !!

# జాతి రత్నాలు

నిస్తేజం - నిర్వీర్యం
నిర్జీవం - నిర్లిప్తం
భరతావని యువశక్తి
పతనోన్ముఖ సంపత్తి !

పగలంతా కలగంటూ
రాత్రుళ్ళు నిద్దుర లేస్తూ
చీకట్లో అడుగేస్తూ
చిల్లరగా జమపడుతూ

సంధ్యాసమయపు టవధికి
శూన్యమయే భవిష్యనిధి !

తాతెవరో - తండ్రెవరో
తల్లెవరో - తానెవరో
తనకేమీ - తెలియదనే
తనయులు వచ్చే రోజులు

త్వరలో వచ్చినిజాలు
జాతికి అందే వరాలు !

# ఛూ.. ఛూ.. ఛూ.. ఛూ... ...

దాణా మేసిన దొరవారి కథ
నో కామెంటిది రాజకీయం !
ఛీటింగ్ చేసిన పెద్దాయన కథ
నో కామెంటిది రాజకీయం !

తన్దూర్ హత్యను నరికేసిన కథ
నో కామెంటిది రాజకీయం -
బోఫార్స్ తుపాకీ కేసు కథ
నో కామెంటిది రాజకీయం !

ముడుపుల కథలో నడిచిన దేమిటి ?
నో కామెంటిది రాజకీయం -
చెలికం కథలో కులకులమేమిటి ?
నో కామెంటిది రాజకీయం -

హైవాకా ను గు భూములు సంగతి
నో కామెంటిది రాజకీయం -
చెప్పేదేమిటి - చేసేదేమిటి ?
నో కామెంటిది రాజకీయం !

పాపం పండే రోజులు వస్తే
కామెంటెందుకు ? - కాటికి నడకే !
ఛూ.. ఛూ.. ఛూ.. ఛూ.. బసున్నా
దొరవార్ల కథ క్లోజన్నా !!

# లాకు లీకులుక్

ఎల్.కె.జీ. పేపర్ లీక్
రాంబ్రహ్మాన్ని పట్టుకోండి -
ఐ.ఐ.టి. లీక్
సుబ్బారావును ఉరితీయండి -
వార్షిక బడ్జెట్ లీక్
పేపరు వాళ్లని మూసెయ్యండి -
తుఫాన్ బియ్యం సేల్స్ లీక్
అమెరికా కాంట్రాక్టరుకు
అరదండాలు వెయ్యండి -
అంతేకాని,
మూలవిరాట్టుని
ప్రశ్నించకండి - పుట్రించ్చకండి
పరిష్కారానికి
నోట్లో వేలేసుకోండి -
ఓడుకేలుతో లీకులు మూస్తాం !

# హై-టెక్ మేత

నోటికి కందింది

తింటే చాలదు -

రిమోట్ సెన్సింగ్ ద్వారా

మొత్తం దేశాన్ని

మేసెయ్

- ఇంకో

నాలుగు యుగాల వరకూ

నీ క్కరువుండదు !



# నిత్య కరువు

నోటి

కడుపు

పసిఫిక్ కన్నా

లోతు కాబోలు -

పాపం

దేశ ఖజానా

ఏం సరిపోతుంది ?

# రస గుళిక

ప్రాచీనం
ముగ్గిన పండు -
అర్వాచీనం
ఆకలి మెతుకు !
అవసరానికి
కావాల్సింది వాడుకో -
నిండుగా
ఆస్వాదించ దగినది
దాచుకో !!



# అక్షర లక్ష్మి

గుణింతాలు ఇన్ని ఉన్నా
ఒక్క "కా" గుణింతానికే
ఐదోతనం అబ్బింది -
లోకులకు, కాకులకు
లోకువైన లక్షణం.
- ఇందులోనే ఉంది !!

# సుద్దులొద్దు

ఓను -
సాంస్కృతిక బంధాలూ
ఆచారపు బులువాట్లూ -
నులుగుబిలో నగుబాట్లు
అందరితో సిగపట్లు !

అందుకే
ఆటవికత మన హద్దు
అనాగరకతే కద్దు
అథఃపతనమే పొద్దు
అంధకారమే ముద్దు !!

# ఇష్టా రాజ్యం

ప్రజాస్వామ్యమంటే
నోరున్నవాళ్ల ఇష్టా రాజ్యం !
ఆబోతులా అరవొచ్చు
కోడెలా మేయొచ్చు
తిమింగలంలా మింగొచ్చు !
ఏం చేసినా ఇష్టా రాజ్యమే
శిక్షాస్మృతి ప్రకారం
దొరకడే తప్పుచేస్తేనే శిక్ష-
హీనంగా
మానభంగం చేసినా
తప్పులేదు !
చూసిన సాక్షికి కూడా
అది అగుపడలే దనిపిస్తుంది !
అడ్డూ అదుపూ లేకుండా
దొంగా భోంచేసినా
తుఫాను బియ్యం అమ్మేసినా
బయటకు పొక్కకుండా
మామూళ్లు దండుకున్నా -
ప్రభుత్వ భూములు కబ్జా చేసినా
కామ్‌గా ఎన్ని స్కాముల్లో కూరుకున్నా
శిక్షాస్మృతి సహిస్తుంది !
అహింసను పాటిస్తుంది -
- మనది ఇష్టా రాజ్యం కదా !

# పారా ఖరాబ్

అడ్డదారిలో ఆడది
హై-టెక్ బిజినెస్ మేగ్నెట్ !
నడుమూ - నాభీ
ఒడుపూ - మెడుపూ
సొంపుగా వడ్డించే ఆడది
సినీ నిర్మాతలకు రిజర్వ్ బాంక్ !
- కాలేజీ కుర్రాళ్లు
ఎంతగా ఖరాబైతే
నిర్మాతలు అంతలా ఖరీదౌతారు !
సినీ కెమేరాలు
ఆడదాని ఒంటిమీది
ఏ సందుల్నీ వదులుట్లేదు-
ఇవన్నీ
పబ్లిగ్గా చూపిస్తున్న కెమేరామీద
నా కులం పోటు
కాబోదొక పొరపాటు !
అందుకే
నా కులం కక్కుతోంది -
ఏదో రోజున
కెమెరా లెన్సుని ఖరాబు చేస్తుంది !!

# నగ్న సమాధి

వడ్డించే
బూతు పేరు
నటన !
పవిత్రమైన బూతుని
పదిమందికీ
వినోదంగా వండటం
అనాగరిక సంఘటన !
- ఈ దుర్ఘటనని
ఆహ్వానించకపోతే
తప్పదు
ముష్కరమూకల
ప్రతిఘటన !
అయినా
నగ్నత్వాన్ని
నగ్నంగానే వండగడుతున్నా-
నాజూకుగా
సమాధి చేస్తున్నా !!

# పాండీ బజార్

పూర్వం
పెద్దలు పడుచు కుర్రాళ్లకి
దాంపత్య రహస్యాల్ని
ప్రైవేటు పెట్టి చెప్పించేవారు !
పాపం, అనాగరకులు వాళ్లు-
ఇవాళ
దంపతులకు కూడా తెలియని
నిగూఢ రహస్యాల్ని
నేల టిక్కెట్ కొనుక్కున్న
నెలయి నిండని పసివాళ్లు కూడా
నిలబడి అప్పగిస్తున్నారు !
సినీ నిర్మాతలూ
మీ సంస్కారానికి జోహార్లు-
జాతి సజీవ దహనానికి
ఇవే మీరిచ్చే నెగళ్లు !!

# మనుగడ చూపాలి

బ్రతుకు తెరువుకు
పెట్టుబడి-
ఆడతనమే కావాలా?
అంతకన్నా
చేనైనది సంఘంలో లేదా?
అమ్మలా
లాలించే అమ్మకూడా
అందాల్ని అమ్ముకోవాలా?
ఆడతనానికి హద్దు
అమ్మత్వం కాదా?
అంగట్లో చిందులేసి
ఆడది అపహాస్యం కావాలా?
అనాగరక గెంతుల్ని
ఆడాళ్లు సహించాలా?
అసహ్యపు దారుల్లో
కుర్రాళ్లు నశించాలా?
అమ్మలూ
దీన్ని మీరు భరించాలా?
ఆదిశక్తిలా యీ పోకడలను నిరోధించాలా?
మీరే ఆలోచించాలి -
మనుగడ చూపించాలి !

# గాలిపటాలు

సంప్రదాయాలూ
ఆచార వ్యవహారాలూ
యావజ్జీవ సంకెళ్లుగా
యువత భావిస్తే -
విచ్చలవిడి విహారాలూ
తెగిన గాలి పటాలూ
కుళ్లిన రాచపుళ్లూ
తమ జీవితాలు కాగలవని
ఆ జనతే గ్రహించాలి -
అనుభవాన్ని
గౌరవించాలి !



# గీత

భారతీయుడా
కర్మభూమిపై పుట్టి
ముదనష్టాలకి ఆశపడి
అధర్మమూర్తికి పెంపు వెళ్తున్నావా ?
జన్మాంతంలోగా
మర్మం విడచి
మనోవ్యథ చెందాల్సి ఉంటుంది -
మరచిపోకు !

# లంగరెత్తు

దేవుడిచ్చిన
తెలివిని
పెడదారిని పట్టించి,
వెకిలిగా
కాలరెత్తి తిరుగుతున్నావా
కుర్రాడా!
నీ బ్రతుకు
బండబారినప్పుడు -
బాబిచ్చిన బత్తెం
బాజా కొట్టినప్పుడు,
నువ్వేం మొగాడివని
పెళ్లాం
తిరగబడినప్పుడు -
పోరా గొట్టాం అని
కొడుకే చెడ తిట్టినప్పుడు -
మీ నాన్న అనుభవం
నీ కన్నీళ్లుగా కారుతుంది !
గుండెల్ని కాల్చుతుంది ;
అందాకా
ఎదురు చూడక
ఈ వేళే యోచించు !
- భావిని సంబోధించు !!

# బతికీ చావకు !

ఎన్నో మొక్కలు
పూస్తాయి !
కానీ
మల్లెపువ్వే గుర్తుంటుంది -
ఎందరో పుడుతుంటారు
కానీ
కొందరే గుర్తుంటారు !
మరి
నీ కథేమిటి ?
గరిక మొక్కా ? వెదురు చెట్టా ?
పుట్టినందుకు
సార్థకత సాధించు
చచ్చినా
బతికే మార్గం ఆలోచించు !!



# ఎక్కడున్నారు

నేరాలను
పూజిస్తున్నారు -
వ్యభిచారులను
సత్కరిస్తున్నారు !
మనుషుల్లారా
మీరు
మానవులేనా ?

# వెలుగు కావాలి

పదిమందీ ఏం చేస్తే
నువ్వూ అదే చేయాలా?
నీ కో బుర్రంటూ ఉందా?
ఉంటే -
పట్టపగలే బహిరంగంగా
న్యాయాన్ని మానభంగం చేస్తుంటే
నోరులేని వెధవలు పొట్టలు కొడుతుంటే
బడాచోర్లన్ని గ్రామదేవతలుగా ఊరేగిస్తుంటే -
మహారాజులే లంచగొండులై అడుక్కుతింటుంటే
దొంగ సాక్ష్యాలతో ఖూనీకోర్లు రాచబాటు లవుతుంటే
భారతీయ శిక్షాస్మృతి కొయ్యబారి పోతుంటే -
నీ రక్తం ఆరిపోయిందా ?
నీ తెలివి తెల్లవారిందా -
పోనీలే !
అదేదో తొందరగా తగలబడితే
మరో సృష్టి వెలుస్తుంది !
- అదయినా
వెలుగు నిస్తుంది !

# వేట

ఎర కోసం
ఎర్రని ఎండలో
ఎగురుతూ
ఎదురు తెన్నులు చూస్తుంది డేగ -
ఎదుగుదల కోసం
ఎవరి అండాలేని
ఎడారి జీవితంలో
ఏళ్ల తరబడి
ఎదురు చూస్తాడు నిరుద్యోగి -
వీళ్ల గోల
ఏ "లాయూ" కి కావాలి ?



# పని లేదా?

మహాత్ముల్ని
చంపేశారు !
మానవతను
మసి చేశారు;
మరో ప్రపంచాన్ని
మరచిపోయారు -
మేధావులారా
ఇప్పుడేం చేస్తున్నారు ?

# మనమూ పెరుగుదాం

పట్టెడన్నం కోసం
పనికిమాలిన పని చేస్తే -
పట్టి ఉరి తీస్తారు
చిరుద్యోగిని !
ప్రజా ప్రతినిధులై
దాణాయి మేసి, ముడుపులు పట్టి
కోట్ల కుంభకోణాల్లో
పీకలలోతున దిగబడిన
పెద్దాళ్లని ఏం చేస్తారు ?
- దండేసిఊరేగిస్తారు ;
ధైర్యంగా దేశాన్ని రాసిస్తారు
- ఏనుగుకీ పీనుగుకీ సాపత్యమా ?
ఇదే మన రాజ్యాంగ
సమానత్వం !
అందుకని
మనిమూ గొప్పవాళ్లతో సమానంగా
పెరుగుదాం !

# లాల్ సలామ్

రాజ లాంఛనాలతో
సింహాసనంపై ఎక్కిన
అడవి మృగం-
మదమెక్కి
పొట్ట పగిలేలా
మెక్కినంత మెక్కింది-
బొక్కసంలో తొక్కినంత
తొక్కింది!
పాపం పండిన విష ఘడియలలో
అజీర్ణం మోతాదు పెరిగి
ఏం చేయాలో తోచక-
ఇన్నాళ్లూ
ఏటుంగా ఉంచిన విషాన్ని
కసి తీరా మింగింది!
- కడుపు పగిలి చచ్చింది !!

# అవినీతి

బాగా పండుతుందనుకున్నా -

ఎన్ని మందులు కొట్టినా

కలుపు చావట్లంలా !

మందు కూడా విందవుతోంది -

ఇక యీ దేశం బాగుపడుతుందా ?



# గూండ్రాజులు

పేరు ప్రజాస్వామ్యం

గుండాలది రాజ్యం-

దాదాలే వేదాలు

కనిపించని మేధావులు !

అంగరక్ష యుల పూర్వం

నెహ్రూకొక గులాబీ -

ఆత్మబంధువుల నేడు

* కలష్నికోవ్ పటాలం

* కలష్నికోవ్ - ఎ.కె. 47 రైఫిల్ నిర్మాత

# రాజు బొమ్మలు

ఈ శూన్య ప్రపంచంలో
గ్రహాలు పరస్పరం
గురుత్వాకర్షణతో నడుస్తున్నాయ్ !
ప్రపంచాన్ని నడిపిస్తున్నాయ్

ఈ మాన్య ప్రజాస్వామ్యంలో
ప్రతినిధులు పరస్పరం
ఒక్కొక్క ఆకర్షణతో నడుస్తున్నారు -
ప్రభుత్వాన్ని నడిపిస్తున్నారు !
తేడా యేమంటే
గ్రహాలకు స్వార్థం లేదు
రాచ బొమ్మలకు ఉన్నది అదొక్కటే!
ఏ గ్రహానికైనా
స్వంత ఆకర్షణలో తేడా వస్తే
ప్రపంచమే మసి,
ప్రభుత్వాలు మసి !!

# రోగం కుదురుతుంది

దేశం
దోపిడీ మూకల వశమైందని
ఏడుస్తావేం ?
నిజాయితీగల పుండాకోరు
ఒక్కడూ లేడంటావేం ?
ప్రతివాడికీ
చుర్రెక్కితేనే
పోరగాళ్లంతా బుద్ధిగా ఉంటారు !
జ్వరం
తీవ్రమైతేనేగా
థర్మామీటరు పగిలేది ?
అప్పటిదాకా
పేషంటుగానే ఉండు !
- ఇష్టం లేని పథ్యం
చేస్తూనే ఉండు -

# సవారి

ఒట్టి పల్లకీ మోస్తూ
నా ఖర్మ అనుకుంటావేం ?
అడుసులో కాలేసి
దిగిపోతున్నానంటావేం ?
యేబై యేళ్లొచ్చినా
ప్రజాస్వామ్యపాఠం నేర్చుకోలేదా ?
అల్పాయుష్షు రాజుని చూసి
అదిరి భయ్యేస్తావేం ?
వాడి చేతి కొరడా
నువ్విచ్చినదేగా !
దాన్ని వదులుకోకు -
వాడు బుర్రతీసాకు చూపుతాడు !



# "మబ్బుల్లో..."

నేల అంచులు
తాకనంత ఎత్తులో
సూర్యచంద్రులు
అంటుకొనే స్థాయిలో
నడుస్తున్న మేధావులారా !
నేల పండుతున్న దుర్గంధాలను
పట్టుకుపొండి !
- కుళ్ళు పెరగకుండా ఉంటుంది ;

# ఆడ మొగుడు

అధికారం ఆడదాని లాంటిది
ఆలోచన మొగ పురుషుని వంటిది !
ఏమీలేని ఆడది
ఎంతో ఉన్న మొగాడిని
ఎరచూపి ఆడిస్తోంది !
ఎంతగానో ఆకర్షిస్తోంది -
- అది ఆమె బలం కాదు ;
వాడి నిష్క్రియత్వం !



# ఆకలి దాహం

కొండలూ లోయలతో
ఎత్తూ పల్లాలుగా ఉండే
భూదేవి
ఆడపిల్లే అయినా
ఆవిడలోని అన్నంపెట్టే లక్షణాన్ని చూడు!
ఆకలి తీర్చే క్షణం కోసం
వెతుకులాడు !
అంతేకాని -
ఆమెను పాడు చేయాలని చూడకు !
నీ కడుపు మాడుతుంది !

# కవిత్వం చెబుతావా ?

నీ సిరా చుక్కల్ని
సమాజం మీద చింపించకు -
సహించలేనివాళ్ళు
సరిపోని మాటలతో చంపేస్తారు !
- మమ్మల్ని కెలుకుతావా అని
కుళ్ళుపోతారు ;
అందుకని
టాగూర్‌లా సరోజినిలా
కాళిదాసులా
మేఘసందేశాన్నో
జాలరి కథలనో, జాతీయ గీతాన్నో
రాసుకో -
బిరుదులిస్తారు, బొమ్మలేస్తారు !
సంస్కరించాలని
రాశావో
తిరస్కరించబడతావ్
తిట్లుపాలవుతావ్ !

# కవిత్వం చెబుతావా ?

నీ సిరా చుక్కల్ని
సమాజం మీద చిందించకు -
సహించలేనివాళ్లు
సరిపోని మాటలతో చంపేస్తారు !
- మమ్మల్ని కెలుకుతావా అని
కుళ్లుపోతారు ;
అందుకని
టాగూర్‌లా సరోజినిలా
కాళిదాసులా
మేఘసందేశాన్నో
జాబిలి కథలనో, జాతీయ గీతాన్నో
రాసుకో -
బిరుదులిస్తారు, బొమ్మలేస్తారు !
సంస్కరించాలని
రాశావో
తిరస్కరించబడతావ్
తిట్లపాలవుతావ్ !

# వా(లి)న ధనుస్సు

ఎన్నో
హృదయాల్ని ఎక్కుపెట్టింది
ఇంద్రధనుస్సు !
కానీ
గుడ్లగూబ ముఖాల్నీ
గుబురు మీసాల గూండాల్నీ
ఏమీ చెయ్యలేకపోయింది !
'ఎర' కోసం వెతికే
సరదా రాయుళ్లని
'ఇంచ్' అయినా
కదల్చలేకపోయింది !
ఎన్ని రంగులుండి
ఏం లాభం ?
ఎండు మొహం రంగుని
ఇముడ్చుకోలేక పోయింది -
"పిచ్చిముండ" !

# వా(లి)న ధనుస్సు

ఎన్నో
హృదయాల్ని ఎక్కుపెట్టింది
ఇంద్రధనుస్సు !
కానీ
గుర్లగూబ ముఖాల్నీ
గుబురు మీసాల గూండాల్నీ
ఏమీ చెయ్యలేకపోయింది !
'ఎర' కోసం వెతికే
సరదా రాయుళ్లని
'ఇంచ్' అయినా
కదల్చలేకపోయింది !
ఎన్ని రంగులుండి
ఏం లాభం ?
ఎందు మొహం రంగుని
ఇముడ్చుకోలేక పోయింది -
"పిచ్చిముండ" !

# చిరంజీవి

మనిషి మనుగడ

ఓ కాల్పనిక సత్యం -

కడుపునొప్పితో పరుగెడుతుంటే

దొంగతనం అంటకట్టి

దుమారం రేపుతారు !

ఆకలితో యేడిస్తే

అసూయాపరునిగా ముద్రిస్తారు !

నొక్కిచెప్పగల

దుష్టుడి ముందు

సత్యం

సాక్షిమూలానే చచ్చిపోతుంది !

- ఆర్తితో కాళీ అంటుంది ;

అందుకే

రెండక్షరాల "సత్యం" కన్నా

అసత్యం గొప్పది -

అదే

ఆయుర్దాయం పోసుకునేది !!

# చిరంజీవి

మనిషి మనుగడ
ఓ కాల్పనిక సత్యం -
కడుపునొప్పితో పరుగెడుతుంటే
దొంగతనం అంటుకట్టి
దుమారం రేపుతారు !
ఆకలితో యేడిస్తే
అసూయాపరునిగా ముద్రిస్తారు !
నోక్కిచెప్పగల
దుష్టుడి ముందు
సత్యం
సాక్షిమూలానే చచ్చిపోతుంది !
- ఆర్తితో హెరే అంటుంది ;
అందుకే
రెండక్షరాల "సత్యం" కన్నా
అసత్యం గొప్పది -
అదే
ఆయుర్దాయం పోసుకునేది !!

# నాన్ సెన్సా(ర్) ?

మన జాతి పరువు
ఫిలిం సెన్సార్ వాళ్ల
చేతుల్లో ఉంది !
పిల్లల్ని దొంగలుగా మార్చినా
కుర్రాళ్లని రౌడీలుగా పురికొల్పినా
ఇరుకు బుర్రల్లో
కొత్త కుళ్లు నింపినా-
ఆడదాన్ని అసహ్యంగా
దిగజార్చినా -
విలువల్ని
అర్ధణాకు అమ్మేసి
నీచ మానవుల్ని సృష్టిస్తున్నా
వాళ్ల సొమ్మేమీ పోదు -
ఇష్ట రాజ్యప్రభుత్వంలో
ఎవరి పోకడ వారిది !
ఎవరు
దీన్ని సరిదిద్దేది ?

# నాన్ సెన్సా(ర్) ?

మన జాతి పరువు
ఫిలిం సెన్సార్ వాళ్ల
చేతుల్లో ఉంది !
పిల్లల్ని దొంగలుగా మార్చినా
కుర్రాళ్లని రౌడీలుగా పురికొల్పినా
ఇరుకు బుర్రల్లో
కొత్త కుళ్లు నింపినా-
ఆడదాన్ని అసహ్యంగా
దిగజార్చినా -
విలువల్ని
అర్థణాకు అమ్మేసి
నీచ మానవుల్ని సృష్టిస్తున్నా
వాళ్ల సొమ్మేమీ పోదు -
ఇష్టా రాజ్యప్రభుత్వంలో
ఎవరి పోకడ వారిది !
ఎవరు
దీన్ని సరిదిద్దేది ?

# యుగధర్మం

యుగధర్మం మారిపోయింది
దుర్యోధన నీతి శిరోధార్యమైంది !
ఆనాటి పాంచాలి
యీనాడు వీధికొకతె వెలుస్తోంటే
ప్రతి మగాడూ దుశ్శాసనుడవుతున్నాడు -
మన సినీ నాయికలు
పాంచాలికన్నా హెచ్చు పతివ్రతలు !
అందరికీ
ఆరాధ్య దేవతలు !
రావణాబ్రహ్మ
సీతను కిడ్నాప్ చేయటానికి కారణం
పర్ణశాలలో
ఒంటరిగా ఉన్న ఆమె మాన సంరక్షణం !
ఈ యుగ ధర్మాన్ని
కాపాడే వారు దుర్యోధన తమ్ముళ్ళే !!

# యుగధర్మం

యుగధర్మం మారిపోయింది
దుర్యోధన నీతి శిరోధార్యమైంది !
ఆనాటి పాంచాలి
యీనాడు వీధికొకతె వెలుస్తూంటే
ప్రతి మగాడూ దుశ్శాసనుడవుతున్నాడు -
మన సినీ నాయికలు
పాంచాలికన్నా హెచ్చు పతివ్రతలు !
అందరికీ
ఆరాధ్య దేవతలు !
రావణాబ్రహ్మ
సీతను కిడ్నాప్ చేయటానికి కారణం
పర్ణశాలలో
ఒంటరిగా ఉన్న ఆమె మాన సంరక్షణం !
ఈ యుగ ధర్మాన్ని
కాపాడే వారు దుర్యోధన తమ్ముళ్లే !!

# భారత క్రాంతి

అసూయను
ఆధిపత్య లాలసతను
అంగట్లో నిలుపుకున్న
ప్రజాస్వామ్య రాజ్యం -
మరో ప్రజాస్వామ్యదేశానికి
పోటీగా
నియంతృత్వానికి కొమ్ముకాస్తోంది!
సహించే దమ్ములేక
కూటనీతిని పన్నుతోంది-
కుటిలత్వాన్ని పెంచుతోంది;
దాని కూహకాలకు
నిత్యాగ్నిహోత్రం భగ్గుమంటోంది;
దీన్ని మలచాలంటే
భారతీయత కావాలి !
అందుకోసం పటిలంగా
దాన్ని పొందటి చేద్దాం;
- తరతరాలకు
విస్తరింప చేద్దాం !

# భారత క్రాంతి

అసూయను
ఆధిపత్య లాలసతను
అంగట్లో నిలుపుకున్న
ప్రజాస్వామ్య రాజ్యం -
మరో ప్రజాస్వామ్యదేశానికి
పోటీగా
నియంతృత్వానికి కొమ్ముకాస్తోంది!
సహించే దమ్ములేక
కూటనీతిని పన్నుతోంది-
కుటిలత్వాన్ని పెంచుతోంది;
దాని కూహకాలకు
నిత్యాగ్నిహోత్రం భగ్గుమంటోంది;
దీన్ని మలచాలంటే
భారతీయత కావాలి !
అందుకోసం పదిలంగా
దాన్ని పోషించి చేద్దాం;
- తరతరాలకు
విస్తరింప చేద్దాం !

# మనిషివైతే... ...

నీతి పాఠాలు కాదు

నియమ ప్రవర్తన కావాలి-

వేరతత్వం కాదు-

నిస్స్వార్థత కావాలి!

నిలువుదోపిడి కాదు-

నిజాయితీ కావాలి;

నీచబుద్ధులు కాదు

నిజమైన విలువలు కావాలి!

ఎవరిస్తారు ?

ఎక్కడనుండి వస్తాయి -

- నీవే ... నీవే ....

నీలోంచి రావాలి

నువ్వొక్కడవే ఇవ్వాలి !

లే -

ఆచరణకు పూనుకో ...

# మనిషివైతే... ...

నీతి పాఠాలు కాదు

నియమ ప్రవర్తన కావాలి-

వేరతత్వం కాదు-

నిస్వార్థత కావాలి!

నిలువుదోపిడి కాదు-

నిజాయితీ కావాలి;

నీచబుద్ధులు కాదు

నిజమైన విలువలు కావాలి!

ఎవరిస్తారు ?

ఎక్కడనుండి వస్తాయి -

- నీవే ... నీవే ....

నీలోంచి రావాలి

నువ్వొక్కడవే ఇవ్వాలి !

లే -

ఆచరణకు పూనుకో ...